

ఓమ్

శ్రీపురుహూతికా పరమేశ్వర్యై నమః.

శ్రీ వీర వెంకటకుమార

త్రిముఖలింగేశ్వర పరబ్రహ్మణే నమః.

---

శ్రీస్వామివారి వగైరా

# దేవతల పాటలు.

## దేవి పాట.

దేవి। దేవి। ఓమహాదేవి। రక్షించవమ్మా।
ఓలోకమాత॥ దేవి। దేవి। ఓపురుహూతికా
దేవి। రక్షించవమ్మా। ఓఈశ్వరమ్మా॥ దేవి॥

---

సి. గోపీనాధం,
జిల్లాకోర్టు ప్లీడరు,
ముకాం, కొవ్వూరు.

---

వాణీ ముద్రాక్షరశాల, బెజవాడ.

1912.

# పీఠిక.

ఈ పీఠికాపుర మహిమనుగూర్చి యిదివరలో నేను అచ్చు వేయించిన నోటీసులలో కొంతవరకు వ్రాసియుంటిని. ఈ వీర వెంకటకుమారస్వామివారికి గానము చాలాప్రీతికరము. వారు అప్పటప్పట అనేకపాటలు పాడియుండిరి. శ్రీ పురుహూతికాదే విన్ని యింకా ఇతరదేవతలున్ను కూడా పాడినపాటలు కొన్ని యిప్పుడు ప్రచురపరచినాను. వాటియందు ప్రీతిగల భక్తులు పాటవిధానమును తెలసికొనవచ్చును. దేవీనవరాత్రములలో ఒకపాటకున్ను సన్నిధిలో యేర్పరుచబోవుచున్నాను. గనుక అచ్చట తెలుసుకొనవచ్చును.

2. యీక్షేత్రమునకు శ్రీ పురుహూతికాదేవిన్ని శ్రీ స్వామి వారున్ను ప్రధానదేవతలై యున్నారు. వారిద్దరిలోను శ్రీదేవి అధిష్ఠానదేవత. సదరుదేవియొక్క ఛాయావిగ్రహము బయలువెడలును గనుక ఆ పరదేవతప్రీతికొరకు యీ దిగువపాట పాడుకొనవలసినదని శ్రీస్వామివారు సెలవిచ్చినందున భక్తులైనవారు పాడుకొనవచ్చును.

పాట

**దేవి । దేవి । ఓమహాదేవి । రక్షించవమ్మ । ఓలోకమాత ॥ దేవి । దేవి । ఓపురుహూతికాదేవి । రక్షించవమ్మ । ఓఈశ్వరమ్మ ॥దేవి॥**

3. ఈస్వామివార్కి ముగ్గురుదేవులు (1) దేవసేనాదేవి (2) లవలీదేవి, (3) ఛన్నఘంటాదేవి. వీరిముగ్గురిలో దేవసేనాదేవి ప్రధానురాలు. ఈమె సృష్టినిర్మాణములో ఆరవదేవి. ఈమెనే షష్ఠీదేవి యని పురాణములందు వాడుదురు. ఈస్వామివారు తమనామము జపించు విధానము అప్పటప్పట శెలవిచ్చి యున్నారు,

(1) వీరవెంకటకుమారత్రిముఖలింగేశ్వరస్వామినేనమః.

(2) ఛన్నఘంటాపరమేశ్వరీసహిత వీరవెంకటకుమారత్రిముఖలింగేశ్వరస్వామినేనమః.

(3) వల్లీ సేనాసమేత వీరవెంకటకుమారత్రిముఖలింగేశ్వర స్వామినేనమః.

(4) ప్రచండ వీరవెంకటకుమార త్రిముఖలింగేశ్వర స్వామినేనమః.

(5) పంచత్రింశద్దేవతాసహిత వీరవెంకటకుమారత్రిముఖలింగేశ్వరస్వామినేనమః.

(6) చండేశ్వర భృంగీశ్వరసహిత వీరవెంకటకుమారత్రిముఖలింగేశ్వరస్వామినేనమః.

(7) సమస్త పరివార దేవతాసహిత వీరవెంకటకుమార త్రిముఖలింగేశ్వరస్వామినేనమః.

పంచశక్తి సహిత శ్రీపురుహూతికాపరమేశ్వరీ సమర్పణమస్తు. పంచత్రింశద్దేవతాసహిత శ్రీవీరవేంకటకుమార త్రిముఖలింగేశ్వర పరబ్రహ్మార్పణమస్తు. మంగళం. మంగళం. మంగళం. శ్రీ*శ్రీ*శ్రీ*

కొవ్వూరు,<br>**24—9—12.**

సి. గోపీనాథం,<br>మకాం కొవ్వూరు.





శ్రీస్వామివారు ద్వారా

# దేవతల పాటలు.

(1) స్వామివారు ఆదిలో పాడినపాట.

పాట.

పదపదరా ఇక । జాలములేదురా । పద ।

(2) 1910 సం। నవరాత్రములలో క్షీరములుపోయుటకు తగిన పాత్రలులేక తత్తరపడుచుండగా స్వామివారుపాడినపాట.

పాట.

అటువంటిసన్నిధిక । బంగారుకలశములందే । అ॥

ఈసన్నిధి దివ్యసన్నిధులాయినపిమ్మట పుణ్యాంగనలు సువర్ణకలశములలో క్షీరములుతీసుకువచ్చిరని స్వామివారు సెలవిచ్చిరి.

(3) 1910 సం॥ నవరాత్రములలో అద్భుతములైన దర్శనములు ఇచ్చి స్వామివారుపాడిన పాట.

ఇట్టివిషయములునీకు । చూపించుచుంటిని॥ఇ॥

(4) తమయొక్క సన్నిధులు యానత్తు వర్తమానపురాజాగారే ప్రతిష్ఠ చేయించెదరని స్వామివారు శెలవిచ్చి పాడిన పాట.

మారాజువాడు । మీరాజువాడు । రాజేసుమీ । వానికినేను । గొప్పమేలు । చేసెదాను । మేలుచేసెదాను । మా॥

(5) ఇంకొకవిషయమును తిరిగిపాడినపాట.

మనుష్యమాత్రుడైన । నాలాగినాడైన । వానివల్లనే నాసన్నిధ । భూలోకస్వర్గమునలెచేయును॥ మ॥

శ్రీ రాజాగారు మనుష్యమాత్రుడైనప్పటికి తనులాగి సంభూతుడగుటవల్ల తమసన్నిధ భూలోకస్వర్గమును చేయునని పాడిరి.

(6) స్వామివారిపాట.

అమ్మవారి । శెలవుప్రకారం । నడుచుకో । అమ్మ॥

(7) స్వామివారిపాట.

ఇకనేమిచెప్పెదనే । ఇకమీదటజరుగబోయ్యేది॥
ఇక నేనేమిచెప్పెదనే । ఇపుడేమిచెప్పెదనే । ఇక
మీదంట । జరుగాబోయ్యేదీ॥ నేనే॥

(8) 1910 సం॥లో నవరాత్రములు అయినతర్వాత కార్తీక శుద్ధ పౌర్ణమికి పూజలుచేయుచున్నప్పుడు స్వామివారు శెలవిచ్చి పాడిన పాట.

అంతకిపైనాకు । హెచ్చుగాజరుగును ।
ముందేజెప్పితి । ముందేజెప్పితిరా । అం॥

(9) స్వామివారిపాట.

రోజుకు వెయ్యినామము । చేయుచున్నది ।
నా కెంతో ప్రీతిగాను॥ రో॥

(10) స్వామివారు దర్శనమిచ్చినతర్వాత సన్నిధికి వెళతామని శెలవిస్తూ పాడిన పాట.

నేవెళుతానె । వెళుతానె । వెళుతానె । వెళుతానె ।
సన్నిధీకి । నేపోతానె। పోతానె । పోతానె। పోతానె
సన్నిధీకి । సన్నిధీకి । సన్నిధీకి॥ నే।

(11) స్వా॥ పాట.

సదూరు బెదురు లేక । నమ్మికతోడుత । సాగునురా ।
ఆదినాగునురా । సంసిద్ధమూ । సంసిద్ధమూ । సంసిద్ధము।
సంసిద్ధము । సంసిద్ధము । సి । సి । సి । సి । సి । సి । సి।
సిద్ధ । సం॥

యీపాట మరివకనాటికాలమందు తిరిగి మార్చిపాడిరి.

(12) పాట.

సదురు బెదురు లేక । నమ్మికతోడుత । సాగునురా ।
ఆదిసాగునురా । రాజెంతో । యోచనలో । యున్నా
డు। యున్నాడు । రాజెంతో॥ సదు॥

(13) ఒకనాటికాలమందు స్వామివారి సన్నిధయొక్క అర్చకు
డయిన కోట లచ్చయ్యగారు సన్నిధియందు పూజాయేర్పా

ట్లవిషయమయిన్ని సన్నిధివిషయమయిన్ని తనవిషయమ యిన్ని మనవిచేసుకొన్నట్లు పాడిరి.

పాట.

వాడు। లచ్చయ్యవచ్చాడు। సన్నిధికి। వచ్చియేమి స్వామీ। వాడు॥

యీపాట పాడినమీాదటనే సన్నిధిలో కొన్ని యేర్పాట్లు చేయిసిని.

(14) పిఠాపురంయెస్టేటులోవున్న శివసన్నిధులుయావత్తు దివ్య ప్రతిష్ఠలు కాబోతవని శలవిచ్చిపాడిన పాట.

వారే। శివప్రతిష్ఠ జేసినవాడికీ। యికజన్మకలదా॥ వా॥

(15) పాట.

ధూపదీపములతో। నాకు సంతృప్తిబొంది। సంతృప్తిబొంది। సంతృప్తిబొంది। కటాక్షించెదా॥ ధూ॥

(16) స్వామివారిపాట.

కమలాలయా। నీకుమంగళామే। కమలాలయానీకు। మంగళామే। నాయొక్కభక్తులనూ। కటాక్షించు॥కమ॥

(17) స్వామిపాట.

అభయము। అభయము। అభయము। అభయము। అభయము। యిస్తినిరా॥ అభ॥

(18) స్వా॥ పాట.

అన్నపానాదులతో । నాసన్నిధిని పరితృప్తి చేశి ।
ఆరోగ్యము । కోరుము। ఆరోగ్యము। కోరుము ।
ఆరోగ్యముకోరుము॥ అన్న॥

(19) స్వా॥ పాట.

ఆరోగ్యమూ । కోరినవానికి । అరనిమిషమాయిన యేమ
రక । అరనిమిషమయిన యేమరక । యేమరక యుండ
వలె॥ ఆరో॥

(20) యీ స్వామివారికి క్షీరాభిషేకం బహుప్రీతియని పాడిన

పాట.

పాడిమొదవు। లేకానికివచ్చి । క్షీరములనిచ్చి ।
వెళ్ళ్యానే॥ పా॥

(21) పాట.

దేవులునాలుగురూ । సిద్ధములై యున్నారు । దుర్గలక్ష్మి
సరస్వతి । ఛన్నఘంటదేవి । ఛన్నఘంటదేవి । మా
ముద్దులాదేవి॥ దేవులు॥

(22) యీపాట కొంతకాలమునకు మార్చిపాడిరి.

పాట.

దేవులునలుగురు । ప్రసన్నత చెందిరి । దుర్గలక్ష్మిసరస్వతి

పురుహూతిక దేవి। పురుహూతికాదేవి। పీఠికాదేవి॥ దేవ్రు॥

(23) వర్తమానపురాజాగారు తమయొక్క అంశసంభూతులని స్వామివారుపాడిన

పాట.

మదంశసంభూతుడాని। నీవెరుగవా। మ॥
నీవెరుగవా। నివెరుగవా। నివెరుగవా। నివెరుగవా॥మ॥

(24) పాట.

నాసన్నిధకి। యోగింపట్టిపోయిందని।
వెనుకచెప్పలేదా॥ నాస॥

(25) సరస్వతీదేవిపాడిన పాట.
చదువ్రులకెప్పిన ధనీ॥ చ॥

(26) విఘ్నేశ్వరస్వామివారి పాట.
విఘ్ననాశములు। చేసెడివాడను। నేనే ప్రత్యక్షమయి తీని॥ విఘ్న॥

(27) పాట.

రోజులెన్నాళ్ళోలేదూ। సమీపించినాదీ।
రోజులెన్నాళ్ళోలేదూ॥

(28) పాట.

గోపీనాథుడింట్లో। భజనచేయుచున్నారు। యిచ్చట ప్రార్థనా। అచ్చటభజనా। గోపీనా॥

(29) పాట.

మహానై వేద్యఫలం యేమని చెప్పాదు। నేనేమని చెప్పాదు॥

(30) పాట.

యేమిరా । గోపీనాధా । దేవాతలాదయా । లేకపోతే
పోని । భయమూ లేదూరా। యీనరాధనూలాదయా।
లేకపోతేపోని । భయమూ లేదూరా॥

(31) పాట.

యీ యోగిమూ । త్రిప్పుడానికే । హరిహరబ్రహ్మాదుల
తరముగాదూర॥ యీ॥

(32) పాట.

కోటలచ్చుయ్యకొండుకూకు । పిచ్చుకుమురుచు। పిచ్చుకుదిర
వాను పెళ్ళిచేసుకోని । వాడిని। తా రంపచేసుచు॥ కో॥

(33) పాట.

నాకింతహాయిగా । యెవ్వారుగానాము । చేసిననూ్న ।
సాంశోషపరచిరి । శౌరిగోపినాధా॥ నాకిం॥

(34) పాట.

యాంత మాందికి । యోగముసమీపించినాది॥ యొం॥

(35) మహాలక్ష్మి పాట.

దేవులునాలూగురు। దర్శనమిస్తిమి। దుర్గలక్ష్మిసరస్వతి,

ఛన్నఘంటదేవి। ఛన్నఘంటదేవి। మీా స్వామివారి ముద్దులదేవి॥ దేవు॥

(36) పాట.

నే। డెన్మోర్హౌసుకు। డెన్మోర్హౌసుకు। (Denmore House) వెళ్యాతానే॥ నే॥

(37) పాట.

భగవన్నామము। కీర్తనలుగ జేసి ప్రార్థించినవాళ్ళకు ఏదీకష్టసాధ్యము లేదురా॥

(38) పాట.

మూాఢాత్ములకు। యెంత చెప్పినా। జ్ఞానశూన్యమే॥

(39) పాట.

గయుడికొడుకునీవు। గయుడికొడూ॥ కేగయు॥
గయుడికొడుకుగనుక। రాజప్రతినిధిగ చేశెదా॥ గయు॥

(40) శ్రీస్వామివారికి క్షీరాభిషేకమున్ను సామగానమున్ను వేదపారాయణమున్ను చాలా ప్రీతిఅయినట్లు తెలియపరుస్తూ పాడినపాట.

పాట.

క్షీరము లేమాకు। మిగులప్రియామూలు। సామగానామె మాకు। మిగులప్రియము। వీరవెంకటాకుమా। రాత్రిముఖ। లింగేశ్వరాస్వామీా। వేదమంత్రామే

వాహశరీరామూ। మూలవలీకి। మేమేప్రియామూ। వీర వెంకటాకుమా॥

(41) మహాలక్ష్మిపాడిన పాట.

యేమమ్మాలవలీ। నీకేమికొరతా। నాయొక్కకటాక్షము పరిపూర్ణముగా కటాక్షిస్తునమ్మా॥

(42) సరస్వతీదేవి పాట.

వీణాగానము। సకునేపెన్నిధి। ఆబ్రహ్మావాక్కున నుండెద॥ వీణా॥

(43) మల్యాల శేషయ్యగారు కోరుకున్న వరమునుగురించి శ్రీస్వామివారుపాడిన

పాట.

శేషయ్య। చచ్చిపొయేటప్పుడూ। నీభక్తులతో కలశిమెలశివుండులాగున। నీబంధువులతో కలశిమెలశివుండులాగున। నీచుట్టాలతో కలశిమెలశివుండులాగున। నీఆప్తులతో కలశిమెలశియుండులాగున। నీసన్నిధిపరిచర్యలుసేయులాగున। వరముకోరి। ఘుటమువిడచె॥ శేష॥

(44) గణపతిస్వామివారి పాట.

కాదే కాదే। వాడిజన్మసఫలము। వాడీపూర్వజన్మము చెప్పెద॥ కా॥

(45) స్వామివారి పాట.

నవరాత్రమూలాలో। బాహుబాగా జేయూరా।
జేశీనా వెంటానే। నేజెప్పలేనూరా॥ న॥

(46) పాట.

మేము 36 ముప్పైఆరు దేవతలమూ। అచ్చట పూజ
లందుకొనేవారమూ॥ మే॥

(47) స్వామివారిపాట.

వారేరా। వారేరా। మహారాజూని జేశేదారు। మహ
రాజుని జేసెదారు॥

ముప్పైఆరుగురు దేవతల ప్రతిష్ఠఅయినతర్వాత శ్రీరాజా
గారికి మహారాజయోగం కలుగుతుందని పాడిరి.

(48) సరస్వతీదేవి పాట.

మేము బ్రహ్మలోకములోనివసించి। మహత్తరమయిన
ట్లుగా వెలసెదము॥ మే॥

(49) దేవసేనాదేవి పాట.

నేమున్న సన్నిధికి వెనుకను। నేనుభూమిలోవుంటిని॥ నే॥

(50) ఆదేవిపాటే.

మేమున్న ఆవరణలో యెన్నోగలవు॥ మే॥

(51) పాట.

నాలింగమయమూ। యేమిహేతుప్రియాని। మాలవలీ। తలంచుచున్నది॥ నా॥

(52) పురుహూతికాదేవి పాట

నేనుపరిపూర్ణురాలనైతే। సమస్త దేవతలు సిద్ధిపొందెదరు॥ నే॥

(53) స్వామివారి పాట.

మాదేవియొచ్చటనుండేటప్పుడు । బహుమందిదేవులు అచ్చటనుండెదరె॥ మా॥

(54) పాట.

ఝుడియకురా । నీవు । ఝుడియకురా । నేనే నీస్వామినై వెలసివుండేటప్పుడు॥ ఝు॥

(55) మహాలక్ష్మిపాడిన పాట.

యేలలభించునె । యేలలభించునె । బాపనవాడికి॥ యే॥

(56) మహాలక్ష్మి పాట.

స్రరాజునీకు । నీతులశికోటాలో । నన్నుతీసుకొచ్చి నీకర్పణజేశె॥ స॥

(57) స్వామివారి పాట.

35 ముప్పైఅయిదుదేవతలకు । తృప్తిపరచినాకు తృప్తిచేయండి॥ ము॥

(58) స్వామివారి పాట.

గానామృతములో । మేముస్వాధీనులముకాగలము। యెన్నోమారులుచెప్పితిమి॥ కా॥

(59) పాట.

వారేరా। వారేరా। మాద్వారాపాలకులు । వారేరా। వారేరా । సన్యాశిరాళ్లు॥ వా॥

సన్యాసిరాళ్ళని వాడుకపేరుగల మూడుశిలావిగ్రహములు పిఠాపురంలో వుండివున్నవి. అవి నిరామయమయిన స్థలములో ఆకాశధారే అభిషేకముగాగలిగి వుంటున్నవి. ఆమూడిటిలో చిన్నవిగ్రహములు రెండున్ను యీ స్వామివారియొక్క ద్వారపాలకులని వారిపేరు ఛండీశ్వరుడు, భృంగీశ్వరుడు అని తెలవిచ్చినారు. సదరు రెండువిగ్రహములను అచ్చటవుంచుట బహు అపవిత్రముగాయున్నందున స్వామివారిసన్నిధిలో ప్రవేశపెట్టుట నాముఖ్యకోరికై యున్నది.

(60) పురుహూతికాదేవి పాట.

శాలుక్రకమూమునసూ । భూస్థాపితమయిన । పద్ధెనిమిది పీఠములలో । స్వేప్రధానురాలనూ॥ శా॥

(61) స్వామివారి పాట,

యెవ్వరెట్లుచేయకపోతే। మాకేమి। శాపవిమోచన కాలం సమీపించినది॥ యె॥

(62) స్వామివారి పాట.

పదహారుసంవత్సరములవాడే। పుట్టినదిలగాయతు దేవీభక్తుడే। దేవీవుపాసకుడే॥ ప॥

(63) పురుహూతికాదేవినిగూర్చి స్వామివారుపాడిన పాట.

దేవి। దేవి। ఓమహాదేవి। రక్షించవమ్మ। ఓఈశ్వరమ్మ॥ దేవి॥ ఓలోకమాత॥ దేవి। దేవి। పురుహూతికాదేవి। రక్షించవమ్మ। ఓలోకమాత॥ దేవి॥

ఈపాట సమస్తజనులు దేవీప్రీతికొరకు పాడుకొనుట శ్రేయస్సు.

(65) సన్నిధిలో యీమధ్య నేను ఘంట సమర్పించినందువల్ల దేవిపాడిరి.

పాట.

ఘంటానాదము। చేయిస్తివా। గోపాలుడానీవు। నీవు। నందుడిజన్మములోవుండగా। పెద్దపెద్దఘంటలుగట్టి। గోవులకుసంతోషము। శ్రీకృష్ణునకు సంతోషము। గలుగజేసిన నందుడవురా। గోపాలుడా నీవు॥ ఘంటా॥

(66) స్వామివారికి గానము చాలాప్రియముగుటవల్ల నవరాత్రములలో పాటకునిపెట్టించవలసినదని స్వామివారు సెలవిచ్చి పాడిన పాట.

యిటువంటిగానము । నాసన్నిధని । ఒకటైనబెట్టి । నన్ను తృప్తిజేయరా॥ నీదేవికి ఘంటానాదము । యెంత ప్రియమో । నాకుగానము అంత్రపియము । వరేగోపాలా । ఘంటానాదముయిచ్చిన గోపాలా॥ యిటు॥

(67) యీసంవత్సరము నవరాత్రములకు సంతర్పణవిషయమై స్వామివారు పాడిన పాట.

నవరాత్రములలో । యెంతసంతర్పణ । జేయగలవని । యిపుడే జెప్పరా॥ నవ॥

(68) పురుహూతికాదేవియొక్క ఛాయావిగ్రహము రాన్నైయున్నందున ప్రస్తుతము గ్రామదేవత మరిడెమ్మసన్నిధిలో జరిగేపూజలు నిలుపుఅగునని గ్రామదేవతపాడిన పాట.

నేను గ్రామదేవతను । నేనుగ్రామాదేవతను । నా సన్నిధిలో పూజలుతప్పించి । మా అక్కగారి సన్నిధిలో జరుగును॥ నేను॥

(69) సూర్యనారాయణమూర్తి పాడిన పాట.

పరిదేవత శెలవుప్రకారం । ఆరోగ్యము యివ్వదలచుకొంటిరా॥ పర॥

(70) వారే తిరిగిపాడినపాట.

నేను సూర్యనారాయణమూర్తినిరా । నాకు ఉగ్రము చాలాజాస్తిరా । త్వరగా సంతర్పణజేయరా॥ నేను॥

(71) దేవిపాట.

నాఛాయావిగ్రహము । వచ్చుచున్నదీరా । నీనోటీనుల
తో । అందరికి తెలిసినది॥ నా॥

(72) శ్యామలాదేవిపాట.

వారెవరెవరు । వారెవరెవరు । వచ్చేవారు । మీారెవ
రెవరు । మీారెవరెవరు । వచ్చేవారు॥

యేలూారులోవున్న మహిషాసురమర్దనిదర్శనముయిచ్చేనిమి
త్తం ప్రత్యక్షము కాగా ఆదేవినిచూచి శ్యామలాదేవి యీా
పాట పాడిరి.

(73) యేలూారు జలాపహరేశ్వరుని లింగమునుగురించి మహి
షాసురమర్దని పాడిన

పాట.

యీాలింగము । లింగముకాదూరా । వేరేవున్నదిరా ।
జరాసంధునినాటిదిరా॥ యీాలిం॥

యేలూారులో జలాపహరేశ్వరుడున్ను మహిషాసురమర్ధని
దేవిన్ని ఒక్క ఆవరణలోనేయున్నారు. సదరు లింగము భూ
స్థాపితమై యున్నట్లున్ను జరాసంధుని ప్రతిష్ఠ అయినట్లున్ను
సెలవిచ్చిరి.

(74) దేవీపాట.

నీవుచేయుచున్నటువంటిపూజలకు । మేము ఆనందభరి
తులము । అగుచున్నాముురా॥ నీవు॥

(75) స్వామివారి పాట.

నాపీతి కాపురంబు । యెట్లుందునోచూడు॥ నా॥

పిఠాపురము,
24—9—12.

సి. గోపీనాథం,
జిల్లాకోర్టుప్లీడరు.
మకాం. కొవ్వూరు.

---

